

శ్రీ

# వేణుగోపాలశతకము.

(గీతములు)

ఇది

శృంగారకవి వేంకటరామయ్యచే

విరచితము.

శ్రీయుత వేమూరి-సూరయ్యగారిచేఁ

ప్రకటితము.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందుముద్రితము.

1931

వెల 0—1—0

శ్రీరస్తు.

# శ్రీ వేణుగోపాలశతకము.



## గీతములు.

గీ. శ్రీరమారమణీమణీ చిత్తజలజ
చంచరీక, కృపావిత సకలలోక.
తల్పకల్పిత విశ్రుతదందశూక.
భర్మమయచేల, వేణుగోపాలబాల. 1

గీ. పంకజాసన పురుహూత శంకరాది
దేవమౌళి విరాజిత దివ్యముకుట
రత్నకాంతి నీరాజిత రమ్యపాద
పద్మ, శుభసద్మ, వేణుగోపాలబాల. 2

గీ. ఆద్య, భవరోగవైద్య, వేదాంతవేద్య,
మౌని మానసహృద్య, సమస్తసద్గు
ణానవద్య, నిరంకుశజ్ఞానవిద్య,
పరిస్ఫురత్పద్య, వేణుగోపాలబాల. 3

గీ. మహితభాస్కరమండల మధ్యవర్తి,
సద్గుణస్ఫూర్తి, దేవతాచక్రవర్తి,
సజలజలదాభమూర్తి, దిశాప్రదీప్త
భవ్యతరకీర్తి, వేణుగోపాలబాల. 4

గీ. సత్యభామా మనోంబుజషట్పదాభ,
పరమకారుణ్య రక్షితవనమదేభ,
మూర్తి సుషమాతిరస్కృతాంభోద శోభ,
వారిరుహనాభ, వేణుగోపాలబాల. 5

గీ. రమ్యగుణసీమ, దశరథరామ, భవవి
రామ, రాక్షసభీమ, మార్తాండధామ,
వరపరాక్రమ నిర్జిత పరశురామ,
వదన జితసోమ, వేణుగోపాలబాల. 6

గీ. ఘనరుచిరకాయ, నిహతరాక్షసనికాయ
సన్మునిధ్యేయ, సాధుసజ్జన విధేయ,
పదయుగానత నిజభక్త భాగధేయ,
పద్మభవగేయ, వేణుగోపాలబాల. 7

గీ. మారసుకుమార, వార్ధిగంభీర, శైల
ధీర, దీనజనాధార, దివ్యహార,
దనుజ సంహార, కీర్తి విస్తార, పాద
భక్తమందార, వేణుగోపాలబాల. 8

గీ. వార్షికాభ్రవినీల, సువర్ణచేల,
భక్తసురసాల, పరమకృపా విశాల,
భవ్యలీల, మతంగజపాల, గోప
భామినీలోల, వేణుగోపాలబాల. 9

గీ. బాలశశినిభఫాల, గుణాలవాల,
ధైర్య సురశైల, సాధుసంత్రాణశీల,
జలజసంభవ శివదివస్పతి కృతనుతి
జాల, ఘననీల, వేణుగోపాలబాల. 10

గీ. సకలలోక పరిత్రాణసాధు భావ,
దేవ, వనమాలికాయుత గ్రీవ, ఘోర
దురితవన దావ, నిర్జరస్తుతి విరావ,
భవసరిన్నావ, కేణుగోపాలబాల. 11

గీ. వందిత దిగీశ, సేవకవ్రాత కలుష
నాశ, జగదీశ, హృతభవపాశ, మౌని
చిత్తకమల దినేశ, ప్రసిద్ధజిష్ణు
నీలసంకాశ, వేణుగోపాలబాల. 12

గీ. దీనజనపోష, సంభృత దివ్యవేష,
మంజుతరభాష, కౌస్తుభమణి విభూష,
జలధికన్యా మనోజలజాత పూష,
భక్త పరితోష, వేణుగోపాలబాల. 13

గీ. ధర్మమయవాస, వైకుంఠవాస, భరిత
దాస, గోపీసమాగ మోల్లాస, మృదుల
హాస, విలసితవదన వికాస, నిత్య
బంధురవిలాస, వేణుగోపాలబాల. 14

గీ. శంఖచక్రికౌమోదకీశార్ఙ్గనంద
కాఖ్యసాధనయుత బాహ, హరిహయాశ్మ
సదృశదేహ, సుకవి చిత్తజలజగేహ,
పక్షిపతివాహ, వేణుగోపాలబాల. 15

గీ. పాండు తనుభవపక్ష, కృపాకటాక్ష,
భక్తనిర్జరవృక్ష, శ్రీవత్సకౌస్తు
భాంచిత విశాలవక్ష, సురారిశిక్ష,
పంకజదళాక్ష, వేణుగోపాలబాల. 16

గీ. కంజదళనేత్ర, పాలితగాధిపుత్ర,
సకల మునిజననుతిపాత్ర, సజ్జనాగ
మైత్ర, శయసరసిజధృత గోత్ర, శక్ర
నీల నిభగాత్ర, వేణుగోపాలబాల. 17

గీ. కృష్ణ మాధవ గోవింద కేశవ హరి
పద్మనాభ దామోదర పరమపురుష
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గపాణి
భక్తసురసాల, వేణుగోపాలబాల. 18

గీ. వాసుదేవ ముకుంద గోవర్ధన ధర
గరుడవాహ వినీలాంబుధర శరీర
పుండరీకాక్ష వనమాలి పురుషవర్య
భవ్యగుణజాల వేణుగోపాలబాల. 19

గీ. దేవకీవసుదేవుల దివ్యరాజ
దంపతులకును గృష్ణాభిధం జనించి
కడు నమానుషచర్యలు కడఁగి చేసి
ప్రబలితివిలీల వేణుగోపాలబాల. 20

గీ. పసితనమునందుఁ గంసుని భయమునలన
నందునింటను వ్రేపల్లెయందు డాఁగి
నీవు చేసిన పనులెల్ల నిండువేడ్క
వర్ణన మొనర్తు వేణుగోపాలబాల. 21

గీ. విసపుఁ బాలిడిన త్రిరక్కసికి ముక్తి
నొసఁగిన దయాగుఁడవు నీకు నొరులు సరియె
పేర్మిఁ బాలిడు నందుని భామకేమి
భాగ్య మిడితివో వేణుగోపాలబాల. 22

గీ. వాయురూపంబుతోఁ దృణావర్తుఁ డనెడి
దానవుఁడు కంసునానతిఁ బూని నిన్నుఁ
గొనుచు మింటికిఁ జనవానిఁ గూల్చినావు
పసితనమునందె వేణుగోపాలబాల. 23

సీ. ఒత్తి గిలఁబడుచుండెనో హాయటని య
శోద యుత్సాహముం జెందుచున్న తఱిని
శకటదైత్యునిఁ బదహతి శకలములుగ
నేలఁగూల్పవె వేణుగోపాలబాల. 24

సీ. మన్నుభక్షించినావని యన్నచెప్పె
నోరుచూపుము నాకని చేరఁబిల్చు
తల్లికి నోట విశ్వమంతయును జూపి
భ్రాంతిఁగొలుపవె వేణుగోపాలబాల. 25

సీ. పాలకడవను గోలతో ప్రీలఁజేయఁ
ద్రాటితోడ యశోదని న్రోటఁగట్ట
సగ్గులే కేఁగి మద్దుల శాపములను
బాపినాఁడవు వేణుగోపాలబాల. 26

సీ. చలిదికావళ్ళు మూఁపునఁ జంకఁబిల్ల
గ్రోవులను బూను గోపార్భకులను గూడి
పరుగు పరుగునఁ బచ్చిక బయటఁజేరి
యాలఁగాయవె వేణుగోపాలబాల. 27

గీ. గోపబాలురతోఁ గూడి గోగణంబుఁ
గాచుతఱి బ్రహ్మ నీశక్తిఁ గాంచ నెంచి
వత్సముల వత్సలను డాఁపవాని రూపుఁ
దాలిచితి వీవు వేణుగోపాలబాల. 28

గీ. గోపబాలురతో యమునాపగాత
టంబునకు నేగి నీ వచట న్విషంబు
గ్రక్కు కాళియు పడగలనెక్కి నృత్య
కేళిసలుపవె వేణుగోపాలబాల. 29

గీ. వల్లవులు నిద్ర గూరిన పట్లఁగాఱు
చిచ్చు చుట్టను ముట్టఁగఁ జెదరిపఱచి
మిమ్ము శరణన్న దావాగ్ని మెసవి వారి
నేలినాఁడవు వేణుగోపాలబాల. 30

గీ. గోపికలు నిన్ను భర్తఁగాఁ గోరి గౌరి
పూజసల్ప వివస్త్రలై ముందుగ జల
కేళిసేయఁగఁ బో వారి చేలములను
లీలఁగొంటివి వేణుగోపాలబాల, 31

గీ. ఇంద్రియాగ విఘ్నంబున కింద్రుఁ దప్పి
జాలవానను గురియింప శైలమెడమ
చేత గొడుగుగఁ బట్టి రక్షింపలేదె
యాల గొల్లల, వేణుగోపాలబాల. 32

గీ. రమ్యమైనట్టి యొకశరద్రాత్రి నీవు
వేణుగానమ్ముఁ జేయ నాభీరనారు
లందఱు స్వభర్త లెంతవద్దన్న నీదు
పాలఁజేరరె వేణుగోపాలబాల. 33

గీ. మధుర కేతెంచు తఱి నీకు మంజులసుమ
దామము లొసంగినట్టి సుదాముఁడు మఱి
రాజవస్త్రము లొసఁగిన రజకుఁ డెంత
పరమపుణ్యులో వేణుగోపాలబాల. 34

గీ. కంసు నీమేనమామను గండడంచి
తల్లిదండ్రుల చెఱల వదల్చి తాత
యుగ్రసేనునకు రాజ్యమొసఁగి కీర్తిఁ
బడయవే తొల్లి వేణుగోపాలబాల. 35

గీ. వారణాసిని సాందీపు వద్ద సకల
విద్యలను నేర్చి గురునకు వేడు కలరఁ
గాలుపురి నున్న సుతుఁ దెచ్చి కానుకనిచ్చి
భాసిలితివౌర వేణుగోపాలబాల. 36

గీ. ముదముతో జరాసంధుఁడు మధుర పైకి
దాడి వెడలిన నెదిరింపఁ దలఁపు లేక
కంధిమధ్యమునన్ ద్వారకను సృజించి
భళి వసింపవె వేణుగోపాలబాల. 37

గీ. గుహను నిద్రించు నాముచికుందు కడకు
నేగి వానికి దర్శనం బిచ్చి నుతులు
పడసి సంతోషివై కొన్ని వరము లొసఁగి
మేలు చేయవె వేణుగోపాలబాల. 38

గీ. రత్నహరణాపనింద మరల్ప నెంచి
గిరిగుహాంతర సీమకు నరిగి జాంబ
వంతుతోఁ బోరి తేవె శ్యమంతమణిని
బాలికామణి వేణుగోపాలబాల. 39

సీ. సొంపు మీఱంగ నిన్ను వరింపఁగోరి
తరణి సుతయైన కాళింది తపము సేయ
నామె కోరిక సాఫల్య మందఁ జేసి
భాసిలితి వీర వేణుగోపాలబాల. 40

గీ. నగ్నజిత్తను కోసలనాథు నగరి
నున్న వృషభంబు లేడింటి నుక్కడంచి
నాగ్నజితిని నొక శుభ లగ్నమందుఁ
గేలువట్టవె వేణుగోపాలబాల. 41

గీ. సత్యభామా యుతుండవై సరగ నేఁగి
సమరమున నరకాసురుఁ జదిపి యతఁడు
చెఱ నిడిన రాజకన్యల మొఱలను విని
యేలినాఁడవు వేణుగోపాలబాల. 42

గీ. నాకుఁ గల శంఖచక్ర చిహ్నములె గాక
వాసుదేవాభిధానము న్వఱలు బెట్టు
నీ కనుచు పేర్లు పౌండ్రకు నిహతుఁ జేసి
వన్నె కెక్కవె వేణుగోపాలబాల. 43

గీ. పడఁతు లందఱు కన్ని రూపంబు లగుచుఁ
బదియు నార్వేల కేళికాభ వనములను
వెలసి క్రీడించు నినుఁ గని వెఱఁగుఁ జెందె
నోలి సురమౌని వేణుగోపాలబాల. 44

గీ. ధర్మజుఁడు తా నొనర్చు నధ్వరమునందు
ముందుగా నిన్నుఁ బూజింప నిందఁ జేసి
నట్టి శిశుపాలుఁ జంపిన దిట్టవీవ
భక్తసురసాల, వేణుగోపాలబాల. 45

గీ. పేదయైన కుచేలుండు ప్రీతి గుప్పె
డటుకులను నీ కొసంగిన యంత మాత్ర
సంపద లొసంగినాఁడ వీ శతక మొసఁగు
వాని నేలవె వేణుగోసాలబాల. 46

గీ. సలిలమధ్యంబునందు సంచలన మొందు
మత్స్యయంత్రంబుఁ దునుమాడి మద్రరాజ
తనయలక్షణ వరియించి ఘనయశంబు
బడసితివి గాదె వేణుగోపాలబాల. 47

గీ. మృతసుతులనాగ్ర రను జూపుమీ యటంచుఁ
దల్లి నినువేఁడ వేఁగ సుతలముఁ జేరి
వారిఁ గొనితెచ్చి చూపితి వౌర గోప
భామినీలోల వేణుగోపాలబాల 48

గీ. మంత్రపఠనంబు యోగసమాధి తపము
యాగములు తీర్థసేవలు త్యాగములును
గరము నీ భక్తితో సాటిగా వనియెను
వ్యాసపుత్త్రుండు వేణుగోపాలబాల. 49

గీ. దానధర్మములను జేయ ధనము లేదు
తీర్థయాత్రల కేఁగ శక్తియును లేదు
మోక్ష మెటు లబ్బునాకుఁ బద్మాక్ష తెలియఁ
బలుకు సత్కృప వేణుగోపాలబాల. 50

గీ. యోగముల నభ్యసింపఁగా నోపఁదపముఁ
జేయఁదీక్షిక కల్గదు చిత్తమెపుడు
విషయవాంఛల విడువదు వేయునేల
యేలుదువా యెట్లు వేణుగోపాలబాల. 51

గీ. ఇతరమెఱుఁగక నన్ననారతముఁ గొల్చు
వారిరక్షింతునను నీదువాక్య మనృత
మంచు నెంచెదఁ గరుణతో నరసినన్ను
నేలకుండిన వేణుగోపాలబాల. 52

గీ. త్రిపురహరుఁడును నీమాయఁ దెలియలేక
మోహమును జెందెనని శాస్త్రములు వచింప
నితరులన నెంత రక్షింపు మీశ్వరేశ
పాదభక్తుని వేణుగోపాలబాల. 53

గీ. సత్వగుణయుక్తుఁ గానిన్ను స్వాంతమందు
నెఱిఁగి జీవాత్మఁ బరమాత్మ నేకముగను
జేసి యానంద మగ్నులై చెలఁగుచున్న
వారెముక్తులు వేణుగోపాలబాల. 54

గీ. అజుఁడవయ్యును మత్స్య కూర్మాదిదేహ
సంభృతిం గొంట ధర్మ సంస్థాపనార్థ
మగుట సత్యమ్ము కాకున్న నరయ నీక
కేల జన్మము? వేణుగోపాలబాల. 55

గీ. ఆలగాపరి వనియును యాదవుండ
వనియు నవనీత చోరుఁడవనియుఁ బల్కు
చుందు రినామరూప క్రియాశూన్య నిన్ను
లీలలవిసుమ్మి వేణుగోపాలబాల. 56

గీ. మోహమున గోపకాంతలు, మునులు యోగ
లీల, వైరముచే శిశుపాలుఁ, డతుల
భక్తిఁ బ్రహ్లాదుఁడు, నిన్నుఁ బరమపదముఁ
బడయఁగల్గిరి వేణుగోపాలబాల. 57

గీ. పార్థసారథివై నీవు భారతరణ
మందుఁ గౌరవసైనిక బృందములను
గెలిచి పాండవులకు జయం బెలమినిచ్చి
వన్నెకెక్కితి వేణుగోపాలబాల. 58

గీ. దేవముని సంఘవృతుఁడవై తేజరిల్లు
వాఁడ వయ్యును గోపాలబాలకులను
గూడి గోవులఁ గాచెడిజాడఁ జూడఁ
జాల వెఱఁగయ్యె వేణుగోపాలబాల. 59

గీ. అఖిలజగముల సృజియించు నజుఁడ వీవ
పోరిరక్షించుచుండు విష్ణుఁడవీవ
వానిసమయించుచుండు నీశ్వరుఁడ వీవ
భక్తసురసాల వేణుగోపాలబాల. 60

గీ. నిఖిలలోకావనుఁడవని నిను యశోద
యెఱుఁగక సుతుఁడవనియె పాలిచ్చి వేడ్కఁ
బాత్రిఘలఁ జేర్చి నొసటిపై బూదిపెట్టి
పాలనమొనర్చె వేణుగోపాలబాల. 61

గీ. భారతరణంబునందు విభ్రాంతుఁడైన
పార్థునకు నీవు బోధించుపల్కులెల్ల
లోకముల యుపకృతికయి కాకయేతని
కేల యనియెంతు వేణుగోపాలబాల. 62

గీ. సర్వదా సర్వము నొసంగు సామివయ్యు
జున్ను పాలును పెరుగును వెన్న నేయి
వేఁతలమొఱంగి భక్షించు రీతివింత
లీలఁగానెంతు వేణుగోపాలబాల. 63

గీ. ఆపదుద్ధారక బిరుద మందినాఁడ
వనెడి లోకప్రసిద్ధి నే వినిన కతన
నిన్ను శరణంటి నేలొకో నన్నుఁ గరుణ
నేల కుంటివి వేణుగోపాలబాల. 64

గీ. యోగమేల మహామోక్ష మొసఁగ నీదు
నామమే చాలుఁ బాపియజామిళుండు
విష్ణుపేరిడి యొకసారి పిలిచి చెందె
వైళమే ముక్తి వేణుగోపాలబాల. 65

గీ. ధరణిభవసాగరంబును దాఁటఁగోరు
నరులకున్నావతారక నామమనుచు
నుత్తరకుమారునకు శుకయోగివరుఁడు
పలుకఁగాలేదె వేణుగోపాలబాల. 66

గీ. లేశమైనను లాభంబు లేనిపనులఁ
గాలమును వ్యర్థపుచ్చుచుఁ గడపఁబోక
యితరచింతలుమాని నిన్నెపుడు తలఁచు
వారెముక్తులు వేణుగోపాలబాల. 67

గీ. సభను దుశ్శాసనుండు పాంచాలి మాన
భంగ మొనరింప దేవమాంపాహియనఁగ
నక్షయాంశుకములనిచ్చి యామెఁబ్రోవఁ
జాలితివి నీవ వేణుగోపాలబాల. 68

గీ. యంత్రికిని గుణదోషంబు లగునుగాని
యంత్రమున కుండునే నీవు యంత్రివేను
యంత్రమను గాన దోషభయంబునాకు
నేలకలుగును ? వేణుగోపాలబాల. 69

గీ సత్యభామాభిలాషంబుఁ జక్కఁ జేయ
స్వర్గపురి మెట్టి పాకశాసనునిగొట్టి
పారిజాతముఁ గొనితెచ్చి పడఁతికిచ్చి
భాసిలితి వౌర వేణుగోపాలబాల. 70

గీ. వేదశాస్త్ర పురాణాది విద్యలభ్య
సించినంగాని దయరాదు క్షితిపతులకు
భక్తిగల్గిన మాత్రనీ పరమకరుణఁ
బడయవచ్చును వేణుగోపాలబాల. 71

గీ. అల్ల వైకుంఠమునఁ గ్రీడలాడు నీవు
నందునింట యశోదకానందమందఁ
జిందులను ద్రొక్కి నాట్యంబు సేయుచుంట
లీలలవుఁగాదె వేణుగోపాలబాల. 72

గీ. అన్యులస్మరింపఁ బరులనే నాశ్రయింప
నితరకథలను బఠియింప నెపుడునోరుల
చరితముల నాలకింప నీచరణయుగముఁ
జాలనమ్మితి వేణుగోపాలబాల. 73

గీ. కంసచాణూర వృషభబక ప్రలంబ
మురనరకవత్స ధేనుకముష్టికాఘ
దుష్టరాక్షస నివహంబుఁద్రోలి జగము
నేలినాఁడవు వేణుగోపాలబాల. 74

గీ. ద్రోణిరేయు నపాండవాస్త్రంబుతనదు
గర్భశిశువును బీడింపఁగా సహింపఁ
జాలకుత్తర నినువేడ సరగునఁజని
బాలుఁబ్రోవవె వేణుగోపాలబాల 75

గీ. కామిని త్రివక్రయంగ రాగంబొసంగ
మోదమిగు గొత్త నీకొక్క యేది యన్నఁ
బొందుఁగోరితినన నందమొందఁ జేసి
కేళిఁ దేల్చవె వేణుగోపాలబాల. 76

గీ. తనుభవంబు లపత్యములును భక్తుఁ
డగుట సుతులకంటె రక్షింపఁ దగినయట్టి
వాఁడు భక్తుండటంచును బల్కినట్టి
పలుకు దలఁపుము వేణుగోపాలబాల. 77

గీ. ఉపనిషత్తులు వేదముల్ యోగివరులు
నిర్ణయింపఁగ లేనట్టి నిర్గుణపర
బ్రహ్మమూర్తివి నీవని భావమందుఁ
గేలుమోడ్చెద వేణుగోపాలబాల. 78

గీ. సవ్య నీరదకాయంబు నగు మొగంబు
నెడఁదయురమును సన్ననినడుము దీర్ఘ
బాహువులు గల్గు నీదురూపంబుఁ జూప
వేల? దయతోడ వేణుగోపాలబాల. 79

గీ. కరమునంబిల్ల గ్రోవియుఁ గటిని బీత
వసనముం గీరునామంబు నొసట శిరము
నందు పింఛము కౌస్తుభహార మెదను
దాలిచిన వేల్పు వేణుగోపాలబాల. 80

గీ. పసితనమునుండి నీపాదపద్మ సేవఁ
జేయునను దుఃఖవారిధిం ద్రోయఁదగునె?
పరమకరుణాసముద్ర నాపయిని నీకు
జాలి లేదేల వేణుగోపాలబాల. 81

గీ. ఆర్తజనుఁడను నేను నీవార్తిహరుఁడ
వగుటచేతను బాంధవ్య మమరెమనకు
నట్టినను నన్యుఁగాఁ జూడ న్యాయమయ్య
నీలమణిసేల వేణుగోపాలబాల. 82

గీ. ఓదయానిధి! కష్టాబ్ధి నీదలేక
మునుఁగుచుండేలు చుంటిఁగావున భవత్ప
దాంబురుహ భక్తినావ వేగంబొసంగి
పారమొందింపు వేణుగోపాలబాల. 83

గీ. కర్మములనెల్ల జ్ఞానాగ్నిఁ గాల్చిమరలఁ
బుట్టకుండునుపాయంబుఁ బొందలఁజేయు
భారమే నీది యనుచు ముముక్షులుమొద్దుఁ
గేలొనర్చెద వేణుగోపాలబాల. 84

గీ. మానసంబున నిన్నొకమాఱు తలఁచు
మానవుఁడు ముక్తిఁబొందఁగ ధ్యానమిఁకన
నారతము సేయుచున్నట్టి నాకుమోక్ష
మేలరాకుండు? వేణుగోపాలబాల. 85

గీ. పెక్కుమాటలిఁకేల? పిపీలికాది
బ్రహ్మపర్యంతమును నీవు పరిబలియుంటఁ
దెలిసియుండియు నీమాయవలనఁ దెలియఁ
జాలకున్నాడు వేణుగోపాలబాల. 86

గీ. ముక్తికామినిపై నీకు మోహముంట
భక్తదురితాప హర్తవై పరిబలియుంట
జారచోరత్వములు నీకు సహజములని
పల్కుచుందురు వేణుగోపాలబాల. 87

గీ. పూసలోపలి దారంబు పోల్కి నుండు
వఖిలభూతాంత రాత్ముఁడవగుచు నన్న
బురదనంటని కుమ్మరి పురుగు భంగిఁ
బ్రకృతినంటవు వేణుగోపాలబాల. 88

గీ. దేవతావక గాథా పరిభావభక్తి
సక్తిఁగల్గెడు లాభంబు జనములెఱుఁగ
కారపఠియింప వర్ణింప నాలకింపఁ
బాయునఘములు వేణుగోపాలబాల. 89

గీ. శ్రీద, పల్లవమంజులపాద, మధుర
వేణుగానవినోద, గోపీజనాను
మోద, నిర్వ్యాజ కరుణాప్రసాద, వాద
మేలనను నేల? వేణుగోపాలబాల. 90

గీ. రామనామామృతంబును ద్రావుచున్నఁ
గృష్ణనామ సుధారస తృష్ణమిగులఁ
గంటి రెంటికి భేదంబు గానరామి
భక్తకల్పక వేణుగోపాలబాల. 91

గీ. మేఘమున కిరుప్రక్కల మెఱుములవలె
నీకునిరుగడలం గోపనీరజాక్షు
లింపుమీఱఁగ నిల్చినటింపరాస
కేళిసల్పవె వేణుగోపాలబాల. 92

గీ. గుణవతియు రూపవతియునై కోమరుమీఱు
భీష్మకధరాధినాథుని ప్రియతనూజ
రుక్మిణిని బెండ్లియాడి నిరూఢసౌఖ్య
వార్ధిఁ దేల్పవె వేణుగోపాలబాల. 93

గీ. కనకసుమములఁ బూజింప ధనికుఁ డెలమిఁ
బూజసేయఁడె ములుగొబ్బి పూలఁ బేద
సత్కృపులవలె నుతియింపఁ జాలననుచు
నేలపిరమింతు వేణుగోపాలబాల. 94

గీ. తనయులొనరించు తప్పులు తల్లిదండ్రు
లెన్నఁగణియింపరో నీవునట్లనాదు
నేరముల నెన్నఁబోనక కూరిమినను
పాలన మొనర్పు వేణుగోపాలబాల. 95

గీ. ధరణిసుక్మిణి సత్యసుదంత మిత్ర
వింద లక్షణ భద్ర కాళింది జాంబ
వతి పదార్వేలసుదతులు బలిసికొల్వఁ
బరఁగెదవులీల వేణుగోపాలబాల. 96

గీ. నందనందన బుధహరిచందన సుర
వందితపదారవింద గోవింద సకల
లోకరక్షణదీక్ష కృపాకటాక్ష
భవ్య సంస్తవ్య వేణుగోపాలబాల. 97

గీ. మత్కృతంబైన శతకము మానితంపు
శ్లేషయనుకాదు లెస్సయు లేకయున్న
రమ్యమైనట్టి నీదువర్ణనల కలిమి
వన్నెకెక్కదె వేణుగోపాలబాల. 98

గీ. భువిఁ బ్రమాదీచవత్సర పుష్యబహుళ
పంచమికిఁ దావకీన కృపాసమృద్ధిఁ
చేరచించితి నాచంద్రతారకముగఁ
వఱలఁజేయుము వేణుగోపాలబాల. 99

గీ. అవనిశృంగారకవి పళ్లయ పరిధాన
సుతుఁడ వేంకటరామయ్య నతులభక్తి
చేరచించితి శతకంబుఁ జిత్తగించి
వరము లీవయ్య వేణుగోపాలబాల. 100

శ్రీ వేణుగోపాల పరబ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

